శ్రీగంగామాత్రేనమః

# తిరుపతి గంగ జాతర



ధర్మప్రచార పరిషత్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి - 517 501

శ్రీగంగామాత్రేనమః

# తిరుపతి గంగ జాతర




సంకలనము

**విద్వాన్, డాక్టర్ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**

కార్యదర్శి, ధర్మప్రచారపరిషత్, తి.తి.దేవస్థానములు

★ ★ ★

ప్రచురణ

**ధర్మప్రచార పరిషత్**

**తిరుమల తిరుపతి దేవస్థానములు**

**తిరుపతి - 517 501**

# తిరుపతి గంగ జాతర

ప్రథమముద్రణ : 50,000

మే - 2006

అమూల్యము

ప్రచురణ:

**ధర్మప్రచారపరిషత్**
**తిరుమల తిరుపతి దేవస్థానములు**
**తిరుపతి - 517 501**

డి.టి.పి. & ముద్రణ :

**స్టూడెంట్స్ ఆఫ్‌సెట్,**
**తిరుపతి**

# ముందుమాట

తిరుమల తిరుపతి దేవస్థానం వారు ధర్మప్రచార పరిషత్తు ద్వారా చేపట్టిన ధార్మిక భక్తి ఆధ్యాత్మిక స్తోత్ర పుస్తక ప్రచురణ నిరంతరాయంగా సాగుతూంది. ఈ మధ్య కొన్ని పండుగల ఆచరణ, అంతరార్థం చేర్చి, చిన్న చిన్న పుస్తకాలుగా, అందరూ చదివి గ్రహించి ఆనందించేలా ప్రచురించి, భక్తులకూ, జిజ్ఞాసువులకూ పుస్తక ప్రసాదంగా అందించినాము. పాఠకులు చదివి, ఎంతో ప్రోత్సహిస్తున్నారు.

ప్రస్తుతం "తిరుపతి గంగజాతర" అనే చిన్న పుస్తకాన్ని మీకు ధర్మప్రచారపరిషత్తు అందిస్తున్నది. తిరుపతి గంగమ్మల ప్రశస్తి, ప్రభావం జగద్విదితం. శ్రీవారి సోదరిగా, తిరుపతిగ్రామదేవతగా నిత్యపూజా కైంకర్యాలతో గంగమ్మలు తిరుపతికి ప్రత్యేక ఆకర్షణ శక్తులై అలరారుతున్నారు. ఇక్కడి జాతర తిరుపతివాసులకే

గాక, అనేక ప్రాంతాల వారికికూడా ఆనందదాయకం కావడం విశేషం!

ఈ సందర్భంగా ధర్మప్రచారపరిషత్ కార్యదర్శిగారు సంకలనం చేసిన ఈ పుస్తకంలో జాతర విశేషాలు భౌతికంగానూ, పారమార్థికంగానూ సంగ్రహంగా వివరింపబడటంవల్ల, పాఠకులు ఉభయ విధానందాన్ని పొందుతారు. పరమార్థంలేని పూజావిధానం మన సంప్రదాయంలో ఉండదు కదా!

'గంగమ్మ శ్రీవారి చెల్లెలు' అనడాన్ని సంకలనకర్త చక్కగా సమన్వయం చేశారు. చదవండి. ఆనందించండి.

సదాశ్రీవారి సేవలో
**ఏ.పి.వి.ఎన్. శర్మ**
ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తి.తి. దేవస్థానములు

తిరుపతి
12-05-2006

"సర్వేజనా స్సుఖినో భవంతు"

# కృతజ్ఞతాంజలి

తిరుపతి గంగజాతర గూర్చి చిన్న పుస్తకాన్ని వ్రాసి, ధర్మప్రచారపరిషత్తుద్వారా ప్రచురించి భక్తులకు అందివ్వాలని తి.తి.దే. పాలకమండలి సభ్యులు, 'తుడ' అధ్యక్షులు శ్రీ భూమన కరుణాకరరెడ్డిగారు, ధర్మప్రచార పరిషత్తు పాలకమండలి సభ్యులు శ్రీ ఎస్.వేంకటశర్మ గారూ సూచించారు.

ఈవిధంగా గంగమ్మదేవత నన్నుఅనుగ్రహించిందని భావించి, తప్పక వ్రాస్తా నన్నాను. అయినా నాకు మాత్రం క్రొత్తవిషయం. ఇక్కడి వారికేమో సుపరిచితం. గంగ జాతరపై డా॥ పేట శ్రీనివాసులు రెడ్డి మున్నగువారు పెద్ద పెద్ద పరిశోధన గ్రంథాలే రచించి, ప్రచురించి వున్నారు. వారి ఆమోదంతో కొన్ని విశేషాలు అందుండి స్వీకరించి 'గంగమ్మ శ్రీవారికి చెల్లెలు' అనే విషయాన్నీ, వేషాల విశేషాంశాలూ యథామతిగా భావించి, విన్నవించాను.

భౌతికానికి ఆధ్యాత్మికస్ఫూర్తి చేకూరినపుడే అన్నం పరమాన్నంగా శోభిస్తుంది. రుచీ, శుచీ లభిస్తాయి. కనుక వారివారి రచనలనుండి పదార్థాన్ని గైకొని, దానికి

ఆధ్యాత్మిక స్ఫూర్తిని జోడించి, ఈ చిన్న సంకలన పుస్తకాన్ని సిద్ధంచేసి, గంగజాతర చివరిరోజు భక్తులకు అందించే మహాభాగ్య ...భించింది.

ఈ ప్రయత్నాన్ని సహృదయంతో ప్రోత్సహించిన తితిదే కార్యనిర్వహణాధికారి శ్రీ ఏ.పి.వి.ఎన్.శర్మ గారికి, ...జలులు. ఈ రచనకై ఆదేశించిన శ్రీకరుణాకర రెడ్డి గారికీ, శ్రీ వేంకటశర్మ గారికీ కృతజ్ఞతాంజలులు.

సంకలనంలో చేయూత నిచ్చిన గ్రంథకర్తలకూ, సలహాలిచ్చిన మిత్రులకూ ధన్యవాదాలు.

"ఇందలి గుణాలు గంగమ్మవి. దోషాలు నావి"అని వేరుగా చెప్పనేల?

ఇందులో రచనకంటే – సంకలనమే ఎక్కువ!
"ఎందరో సహాయకులు – అందరికీ వందనాలు"

సదా శ్రీవారిధార్మికసేవలో
**పమిడికాల్వ చెంచుసుబ్బయ్య**
కార్యదర్శి, ధర్మప్రచారపరిషత్
తి.తి. దేవస్థానములు

తిరుపతి
12-5-2006

# తిరుపతి గంగ జాతర

తిరుపతి పేరే పవిత్రతకూ, భక్తికీ, సంకేతం. తిరుపతిశబ్దం విన్నంతనే శ్రీవేంకటేశ్వరస్వామి మనోమందిరంలో విహరిస్తుంటాడు. కలియుగ వైకుంఠంగా పేరుగాంచిన పవిత్రపుణ్యక్షేత్రం - తిరుపతి. నేటి తిరుమల ఒకప్పుడు ఎగువ తిరుపతిగా, ఇప్పటి తిరుపతి దిగువతిరుపతిగా పిలువబడేది. ఇప్పటికీ యాత్రికులు "తిరుపతికి వెళ్తున్నా"మనే చెప్తుంటారు. శ్రీపతినివాసమే తిరుపతి!

సాధారణంగా ఇప్పటి పెద్ద పెద్ద పట్టణాలన్నీ ఒకనాటి గ్రామాలే! గ్రామ ముంటే ఒక గ్రామదేవత వుండటం, ఆ దేవతను ఎవరికి తోచిన పద్ధతిలో వారు పూజించడం సర్వసాధారణాంశం.

తిరుపతికి గ్రామదేవత గంగమ్మ. రాయల సీమలో చాలాచోట్ల గంగమ్మే గ్రామదేవతగా

పూజలందుకొంటూంది-నేటికీ! తిరుపతిలో ఒకే గంగమ్మ దేవత, తాళ్ళపాక గంగమ్మ, తాతయ్య గుంట గంగమ్మ అనే రెండు పేర్లతో దగ్గరదగ్గర్లో రెండు చోట్ల రెండు మూర్తుల్లో ఆరాధింపబడుతోంది. మూర్తూలూ, పేర్లూ రెండైనా దేవత గంగమ్మే!

## గంగాదేవి ప్రాశస్త్యం

గంగ త్రిలోకపావని. దేవమానవ పాతాళ లోకాల్లో ప్రవహించి, అందర్నీ నామోచ్చారణమాత్రం తోనే పవిత్రుల్ని చేస్తున్న పుణ్యనదీరూపదేవత. అమరం "గంగా, విష్ణుపదీ, జహ్నుతనయా, సురనిమ్నగా, భాగీరథీ, త్రిపథగా, త్రిస్రోతా, భీష్మసూః" అని పేర్కొనింది. ప్రత్యేకించి, ఆకాశగంగకు "మందాకినీ, వియద్గంగా, స్వర్ణదీ, సురదీర్ఘికా" అనే పేర్లు వున్నాయి.

హరిపాదం (ఆకాశం)నుండి భూమిని పొందింది కనుక గంగ. మరియు శివుని శిరస్సునుండి భూమిని

పొందింది కనుకనూ గంగ. విష్ణుపాదంనుండి పుట్టింది విష్ణుపది. జహ్నుమహాముని చెవియందు పుట్టింది –జాహ్నవి. దేవతలనది–దేవనది. భగీరథునిచే భూ లోకానికి తేబడింది– భాగీరథి. స్వర్గమర్త్యపాతాళాల్లో ప్రవహిస్తుంది కనుక త్రిపథగ. మూడు ప్రవాహాలు కలది – త్రిస్రోత. భీష్ముని తల్లిగనుక భీష్మజనని.

గంగ జలస్వరూపం. ఆకాశం నుండి మేఘాల ద్వారా నీరు వర్షరూపంలో మనకు లభిస్తుంది. గంగ ఆకాశంనుండి ఏర్పడింది. కనుక ఎక్కడున్న జలమైనా గంగాస్వరూపమే అవుతుంది. గంగను పూజించడ మంటే – జలతత్త్వాధిదేవతను పూజించడమే! సృష్టికి మూలం నీరే! ప్రాణాధారం నీరే! విశ్వమంతా జల

భారతీయసంప్రదాయంలో ప్రతివస్తువూ భౌతికం, ఆధ్యాత్మికం అనే రెండురూపాల్లో వుంటుంది.

భౌతికం కంటికి కన్పించేది. ఆధ్యాత్మికరూపం మనస్సుతో భావించబడి, ఆత్మకు గోచరించేది. ఆత్మకు గోచరించేతత్త్వాన్నే దేవతగా భావించి, మూర్తికల్పన చేసుకొని, మూర్తిద్వారా అమూర్తమైన పరతత్త్వాన్ని ఆరాధించడం జరుగుతుంది. కనుకనే గంగ, తులసి, రాగిచెట్టు, పర్వతాలు, పుణ్యనదీనదాలు, సముద్రాలు మున్నగునవన్నీ దేవతారూపాలై భారతీయులకు ఆరాధ్య మూర్తులైనాయి. ఇలా రూపొందిన దేవతయే గంగమ్మ.

గంగాదేవిని పూజించడం-సాక్షాత్తు జలాధిదేవత యైన పరాశక్తిని పూజించడమే! శివుని శిరస్సుపై నున్నందున పురాణాలు గంగయొక్క పరాశక్తిత్త్వాన్ని గుర్తించి, శివునికి భార్యగా నుతించాయి. పార్వతి విష్ణుసోదరి కనుక గంగనుకూడా విష్ణుసోదరిగానే భావించారు. విష్ణువే వేంకటేశ్వరుడై అవతరించి నందున - గంగాదేవిని వేంకటేశ్వరునికి చెల్లెలుగా స్తుతించారు - భక్తులు! కనుకనే తిరుపతి గంగమ్మ

జాతరలో ప్రతిసంవత్సరం తిరుమల శ్రీవారి ఆలయం నుండి గంగమ్మగుడికి గంప, చేట, పట్టు శేషవస్త్రం, పసుపుకుంకుమలు వస్తున్నాయి–అంటే పుట్టింటివారు ఆడపడుచుకు పంపే మంగళద్రవ్యాల సారె వస్తూంది. కారణం లేనిదే కార్యం జరుగదు కదా!

## మరికొన్ని విశేషాలు

నానాపురాణసారోద్ధారమైన గంగాసహస్ర నామావళిలో గంగను – "అద్రిరాజసుతా, ఈశ్వర వల్లభా, ఖండేందుధారిణీ, గౌరీ, గిరిసుతా, గిరీశ ప్రియా, ప్రణవాక్షరరూపిణీ, పార్వతీ, వైష్ణవీ, మహా దేవార్ధధారిణీ, వైశ్వానరీ, శరజన్మప్రసూ, శితికంఠ మహాప్రియా, స్త్రీ సౌభాగ్యదాయినీ" – అంటూ స్తుతించారు. ఈ నామాలన్నీ గంగాదేవి శివుని అర్ధాంగిగా, గౌరీదేవిగా, విష్ణుసోదరిగా, కుమార జననిగా, స్త్రీలకు మంగళసౌభాగ్యదాయినిగా,

పరాశక్తిగా మూర్తిగొన్న విషయాన్ని నిరూపిస్తున్నాయి. కాగా గంగమ్మ వేంకటేశ్వరునిచెల్లెలు అనడానికి సహేతుకమైన ఆధారాలున్నాయి.

గ్రామంలోని అందరూ అన్యోన్యమైత్రీ భావంతో ఆరాధించడానికి వీలుగా గ్రామదేవతాపూజ ఏర్పడింది. సాధారణంగా ఈ పూజావిధానం అవైదికంగానే వుంటుంది. ఎవరికి నచ్చినరీతిలో వారు పూజించవచ్చు! ఒకప్పుడు గ్రామదేవతను గ్రామస్థులే స్వయంగా పూజించేవారు. తర్వాత క్రమంగా మందిరాలు, ఆలయాలు ఏర్పడినాయి. అప్పుడు ప్రత్యేకంగా పూజారులు వచ్చారు. మునుపు వేప చెట్టుక్రిందనో, కొండక్రిందనో, ఎత్తైన ఒకపెద్ద బండనో, రాయినో వుంచి, దాన్నే గ్రామదేవతగా భావించేవారు. తర్వాత విగ్రహాలు వచ్చాయి. ఇప్పటికీ చాలా గ్రామాల్లో గుడిగోపురాలు లేకుండా, విగ్రహాలు

లేకుండా, పెద్ద బండలే గ్రామదేవతలుగా పూజలు కొంటున్న సంగతి మనం గమనించవచ్చు.

గ్రామ సంరక్షణకూ, మశూచిమొదలగు వ్యాధుల నివారణకూ, దుష్టశక్తులను రానీయకుండుటకూ, జంతువులను వింతవ్యాధులనుండి సంరక్షించుటకూ, వర్షాలు వచ్చి భూములు పాడిపంటలతో సస్యశ్యామలంగా వుండడానికీ, పంటలకు తెగుళ్ళు రాకుండుటకు, పసిబిడ్డలకు అనూహితవ్యాధులు రాకుండుటకూ - ఇలా అనేకశుభఫలితాలకై గ్రామదేవతలను పూజించుట ఆచారంగా ఏర్పడింది. గంగమ్మ విగ్రహానికి 108 కుండల నీటితో అభిషేకం చేస్తే వర్షాలు వస్తాయనే నమ్మకం ఇప్పటికీ వుంది. చేసిన చోట్ల సత్ఫలితం చేకూరిందికూడా!

అన్నిచోట్లా వున్న గంగమ్మకూ, తిరుపతిలో ఎంతో వైభవంగా జాతర జరుపుకొంటున్న గంగమ్మకూ

చాలాప్రత్యేకతలూ, విశిష్టతలూ వున్నాయి. ఇక్కడి గంగమ్మలకు చాలా చారిత్రకనేపథ్యం వుంది. ఇక్కడి ఇద్దరు గంగమ్మలూ మహామహిమగలవారే! తాళ్ళపాక గంగమ్మను పెద్దగంగమ్మ అనీ, తాతయ్యగుంట గంగమ్మను చిన్న గంగమ్మ అనీ పిలుస్తుంటారు.

తాళ్ళపాక గంగమ్మగుడి తాళ్లపాక చెరువు గట్టు (తిరుపతి)పై వుంది. ఈ చెరువే – నేడు ఆర్.టి.సి. బస్‌స్టేషన్ అయింది. తాతయ్యగుంట గంగమ్మగుడి "తుడ" ఆఫీసుకు ముందువైపున ఉంది (ఇప్పుడు). (మల్లయ్యగుంటకట్టకూ, తాతయ్యగుంటకట్టకూ మధ్యలో తాతయ్యగుంట గంగమ్మగుడి వుంది) విశేషంగా మ్రొక్కుబళ్ళు తాతయ్యగుంట గంగమ్మకే సమర్పిస్తూంటారు.

ఈ యిద్దరు గంగమ్మల చరిత్ర, ఇక్కడికి ఎలా వచ్చారో సంగ్రహంగా పరిశీలిద్దాం.

పూర్వం తిరుమలపై శ్రీ వేంకటేశ్వరస్వామి ఒక వైష్ణవభక్తుణ్ణి "తాతా! తాతా!" అని పిలిచేవారట! అందువల్ల ఆ భక్తుని పేరు తాతాచార్యులుగా రూపొందింది.

క్రీ.శ. 16వ శతాబ్దంలో తాతాచార్యుల వంశస్థులకు కైంకర్యంకోసం లభించిన చెరువుకు "తాతయ్యగుంట" అనే పేరువచ్చింది. తాతాచార్యులచే చెరువు (గుంట) గట్టున ప్రతిష్ఠించిన గంగమ్మ కనుక "తాతయ్యగుంట గంగమ్మ" అనే పేరు వచ్చింది.

పూర్వం తిరుమలకు యాత్రచేసే భక్తులు మొదట ఈ గ్రామదేవతను పూజించి, పిదప తిరుమలకు బయలుదేరేవా రని, పెద్ద లంటారు. గంగమ్మ శ్రీవారి చెల్లె లనీ, అందుకే తిరుమల తిరుపతి దేవస్థానముల వారి నుండి (సారె) చీర, రవిక, పసుపు, కుంకుమ, గాజులు మున్నగు మంగళద్రవ్యాలు జాతరకు

ముందురోజు గంగమ్మకు పంపడం ఆనవాయితీగా వస్తున్న ఆచారం.

ఆదిపరాశక్తి అయిన గంగమ్మ తిరుపతికి దక్షిణం వైపున రెండు కి.మీ. దూరంలో వున్న అవిలాల గ్రామంలో పుట్టిం దనీ అంటారు. ఇప్పటికీ అవిలాల గ్రామంనుంచీ పసుపు కుంకుమలు రానిదే గంగమ్మ జాతర చేయరు. కనుక ఆగ్రామంనుండీ విధిగా అమ్మవారికి మంగళద్రవ్యాలు వస్తాయి.

ప్రసిద్ధ వైష్ణవాచార్యుడైన తాతాచార్యులు అన్నమాచార్యులవారి స్వగ్రామమైన తాళ్లపాకనుండి గంగమ్మను తెచ్చి, తిరుపతిలో నిలిపినందున తాళ్లపాక గంగమ్మ అయిం దని ప్రతీతి.

### ఉత్సవాలు

'జాతర' అనేపదం 'యాత్ర' అనే సంస్కృత పదానికి వికృతి. ప్రజ లందరూ మంగళద్రవ్యాలతో,

నైవేద్యపదార్థాలతో ఒక దేవతవద్దకో, పుణ్యస్థలానికో, నదికో, సముద్రానికో గుంపుగా వెళ్లి, అక్కడ పూజలు సల్పి, మ్రొక్కుబళ్ళు చెల్లించి, దైవానుగ్రహం పొందడానికై చేసే ప్రయత్నాన్ని 'యాత్ర' అంటారు. ఇదే జాతర! భారతం మౌసలపర్వంలో యాదవు లందరూ శ్రీకృష్ణుని ఆదేశానుసారం సముద్రతీరానికి జాతర చేసినా రని వుంది.

ఇలా అన్నివర్ణాలవారూ, వర్గాలవారూ ఒక్కుమ్మడిగా జాతరచేయడంవల్ల ప్రజల్లో ఐకమత్యం, ఆత్మీయత, స్నేహం ఏర్పడతాయి.

తిరుపతిలో గంగమ్మ దేవత జన్మదినం ఏర్పడే చైత్రమాసం (చిత్రినెల) తమిళ సంప్రదాయానుసారం - చివరివారంలో జాతర మహావైభవంగా జరుగుతుంది. ఈ జాతర ఉత్సవం వారం రోజులు ఉంటుంది. ఇలా జరిగే ఏడురోజులూ ప్రత్యేక విధానా లున్నాయి.

పూర్వం తిరుపతిని పాలేగాళ్లు పాలించేవారు. ఆరోజుల్లో ఒక పాలేగాడు యువతులను కామించి, బలాత్కరించేవాడట! వాణ్ణి హతమార్చి, స్త్రీశీలాన్ని కాపాడేందుకు పరాశక్తి గంగమ్మగా అవతరించింది. ఈ విషయం పసిగట్టిన ఆ పాలేగాడు ప్రాణభయంతో గంగమ్మకు కన్పించకుండా - ఎక్క డెక్కడో దాగి, జీవించేవాడట! అతణ్ణి ఎలాగైనా బయటికి రప్పించాలనీ, ఎట్లయినా వాణ్ణి హతమార్చా లనీ ప్రతినపట్టిన గంగమ్మ రోజుకొక వేషం ధరించి, నానాబూతులు (చెడ్డమాటలు) తిడుతూ తిరుగుతుండగా, చివరకు దొరవేషంలో వున్ననాడు పాలేగాణ్ణి కనిపెట్టి, అతని తలనరికి, చంపుతుంది. ఇలా కామాంధుడైన పాలేగాణ్ణి సంహరించిన దినమే గంగమ్మ జన్మదినమైన చిత్రినెల కావడంతో, చివరివారంలో గంగమ్మ జాతర ఉత్సవాలు నిర్వహిస్తున్నారు.

ఆనాడు గంగమ్మదేవత పాలేగాణ్ణి కనిపెట్టేందుకై రోజుకో వేషంలో తిరిగినదానికి గుర్తుగా - భక్తులు

ఈ ఏడురోజులూ ఉత్సవాలలో అట్టివేషాల్తో, బూతులు తిడ్తూ తిరిగితే గంగమ్మతల్లి సంతోషించి, తమ కోర్కెలు తీరుస్తుం దని భక్తుల నమ్మకం.

ఈ జాతరకు అనేకప్రాంతాలనుండి జాతిమత కులవివక్ష లేకుండా భక్తులు విశేషంగా వస్తారు. పరాశక్తి స్వరూపిణిగా, మంగళప్రదాయినిగా, శ్రీవేంకటేశ్వరునిచెల్లెలుగా తిరుపతి, తత్పరిసర ప్రాంతంవారి ఆరాధ్యదేవతగా పూజలందుకొనే గంగమ్మ జాతర ప్రారంభసూచకంగా మంగళవారం అర్థరాత్రివేళ చాటింపు వేస్తారు. తిరుపతి సమీపంలో గల అవిలాలగ్రామం జన్మస్థలం. కనుక ఈ ఉత్సవాలు చాటింపురోజున అవిలాల గంగమ్మగుడివద్ద, గ్రామ పెద్దలనుండి పసుపు కుంకుమలు స్వీకరించి, జాతర చాటింపుతో ఉత్సవాలు ప్రారంభిస్తారు. తిరుపతి శ్రీతాతయ్యగుంట గంగమ్మ తరఫున తిరుపతికి చెందిన 'కైకాలవారు' తిరుపతి పొలిమేర్లలో చాటింపు వేస్తారు.

గంగజాతర పూర్తి అయ్యేవరకూ ఊర్లోని వా రెవ్వరూ పొలిమేరదాటి, వేరే వూర్లకు పోరా దని ఈ చాటింపు ఉద్దేశ్యం! తనను మోహించిన పాలేగాడు తనచేయి పట్టుకొని అవమానించా డనీ, గంగమ్మదేవత అతని కోసం వెదకడం జరుగుతుం దనీ భక్తుల విశ్వాసం! అందుకే వేషాల రోజుల్లో మొదటిరోజు 'బైరాగివేషం'.

**1. బైరాగివేషం :**

బైరాగి వేషం బుధవారం వేస్తారు. 'బైరాగి' అంటే వైరాగ్యంగలవాడు. సన్యాసి. జాతరచాటింపు వేసినా రని తెలియడంతోనే చిన్నపిల్లల్లో ఉత్సాహం, ఆనందం పెల్లుబుకుతుంది. వారంరోజులపాటు భౌతిక సంసారికవృత్తిప్రవృత్తులనుండీ మనస్సునూ, శరీరాన్నీ, మరల్చి, వివిధవేషాలతో, గంగమ్మదేవతా స్మరణతో జీవితాన్ని భక్త్యానందమార్గంలో గడపవచ్చుననే ఆకాంక్ష అందరిలో చిగిరిస్తుంది. ఈ ఆకాంక్ష

తరతమభేదాల్ని తారుమారు చేస్తుంది. ఎండా, వానా అనుకోకుండా వేలకొలదీ భక్తులు 'బైరాగి' వేషాల్లో శరీరమంతా విబూది లేదా నామాలూ ధరించి, రేళ్లకాయలమాలలు దాల్చి, అమ్మవారి ఆలయం చేర్తారు. వేషంతో ఇంటినుండి బయలు దేరడంతోనే బూతుమాటలూ వేంమూ వస్తున్నామంటూ మొదలవుతాయి. ఆమాటలు అంటూ, ప్రజల్ని భయపెట్తూ వచ్చి, ఆలయంలో పసుపు, కుంకుమ, వేపాకూ సమర్పించి, అమ్మవారిపాదపద్మాలపై వినమ్రులై నమస్కరిస్తారు. తరతరాల తారతమ్యం భక్తి భావానికి అడ్డురాదనీ, శరీరాభిమానం కాసింతైనా వదలుకొని, భక్తితో జగన్మాతను సేవించి, తరించండనీ ఈ వేషాలు నిరూపిస్తాయి.

మోక్షానికి వైరాగ్యం ప్రముఖసోపాన మని చాటిచెప్పడానికే అమ్మవారు మొదటిరోజు 'బైరాగి' వేషందాల్చింది. త్యాగానికి ఫలం వైరాగ్యం! "త్యాగేనైకే

అమృతత్వ మానశుః" ఒక్క త్యాగంచేతనే మానవుడు
మాధవు డవుతాడు - అనింది ఉపనిషత్తు. వస్తువు
లందు రాగం = అభిమానం, కోరిక లేకపోవుటే
విరాగిత్వం! విరాగి నిర్భయుడూ, నిత్యానందుడూ.
నిత్యతృప్తుడూ కాగలడు. విరాగియై - విశ్వంలో /
సంసారంలో వున్నా - తామరాకుపై నీటి బొట్టులాగా
అంటీ అంటక హాయిగా వుంటాడు - మానవుడు.
ముందుగా దేహాభిమానం నశించాలి. పిదప
దైవాభిమానం చేకూర్తుంది. అందుకే మొదటిరోజు
దేహాభిమానం తొలగడానికై భక్తులు బైరాగివేషాన్ని
వేస్తున్నారు. అయితే దీన్ని వేషంగానే భావించక,
క్రమక్రమంగా ఈ వేషాన్నీ - అందులో తా నున్న
స్థితినీ గుర్తించుకొంటూంటే వైరాగ్యభావన
ఉదయిస్తుంది. వైరాగ్యం లేనిచోట స్వార్థం, స్వార్థ
మున్నచోట రాక్షసత్వం తాండవిస్తుంటాయి.
బూతుమాటలుకూడా దేహం మీద, భౌతికసుఖాల మీద
వున్న వ్యామోహాన్ని తొలగించే సాధనాలే అవుతాయి.

## 2. బండవేషం :

రెండవ రోజు "బండవేషం" వేస్తారు. అమ్మవారి మీద భక్తితో గురువారం (బేస్తవారం) ఉదయాన్నే చిన్నా పెద్దా అందరూ ఒంటికి రంగులు పూసుకొని, అడవిలో పూచే బండపూలతో మాలలు కట్టి మెడకూ, భుజాలకూ, మణికట్లకూ ధరించి, ఒక రోకలిని, ఒక కర్రను పట్టుకొని, ఒకదాని కొకటి తట్టుకొంటూ, బూతులు తిట్టుకొంటూ అందరూ గుంపై గంగమ్మ గుడివద్దకు వస్తారు. అక్కడ కర్పూరం వెల్గించి, తాము ధరించిన బండపూలదండల్ని త్రెంపి, అమ్మవారి ముందుంచి, ఇళ్లకు వెళ్తారు. ఈ వేషానికి తగినట్లు "పచ్చి బండబూతులు" తిట్టడం మామూలు. ఈ మాటలు విని అందరూ బండవలె నిశ్చేష్టులు కావాల్సిందే కాని, కోపం, బాధ చెందరాదు.

బండ=స్థాణువు. కదలికలేనిది. బండవేషంలో

ధరించేవి బండపూలు. ఆనాడు తిట్టేవి బండబూతులు. ఎన్ని కష్టాలూ, నిందలూ వచ్చినా, అవి శరీరానికే కాని, మనస్సుకు కావనీ, ద్వంద్వాలలో మానవుడు బండవలె కదలక మెదలక ద్వంద్వాలను సహించి సదా సంతోషంగా వుండా లనీ, ద్వంద్వసహిష్ణుత మొదటివేషమైన వైరాగ్యానికి ఫలమనీ - ఈ బండ వేషం నిరూపిస్తూంది. ద్వంద్వాతీతుడు విషాన్ని కూడా అమృతంగా మార్చుకోగలడు. అట్టివాడు కనుకనే శివుడు 'స్థాణువు' అయ్యాడు. అట్టిస్థాణుత్వప్రాప్తి సంపూర్ణజ్ఞానానికి ఫలమని చాటి చెప్తూంది - ఈ 'బండవేషం' ద్వారా గంగాంబ!

## 3. తోటివేషం :

ఇది మూడవనాటి వేషం. శుభ్రపరచేవారినీ (వీధులు) బలితిరిగేవారినీ 'తోటి'వా రంటారు. శుక్రవారం మధ్యాహ్నం నుండి తోటివేషాన్ని

గుడితరపువాళ్ళూ, తిరుపతి వాసులూ వేస్తారు. ఈ వేషంలో కైకల కులస్థుడు స్త్రీ వేషాన్నీ, చాకలి కులస్థుడు పురుషవేషాన్నీ ధరిస్తారు. స్థానికులు వేసే తోటివేషంలో పిల్లలు బాగా పాల్గొంటారు. బొగ్గుపొడినిగానీ బండి కందెనగానీ ఒళ్ళంతా పూసుకొని, తెల్లనామం చాది, కనుబొమలపై చుక్కబొట్లు పెట్టుకొంటారు. పిల్లలు మీసాలు కూడా పెట్టుకుంటారు. నడుముచుట్టూ, తలకూ వేపాకు మండలు కట్టుకుంటారు. పాతపొరక, చేట చేతపట్టుకొని కన్పించినవారిని చిన్నగా కొట్తారు. బూతుపాటలు పాడుకుంటూ గంగమ్మగుడికి వచ్చి, ముందుగా వేపాకుమండలూ, పిదప చేటా పొరకా పారేసి, గంగమ్మనుకూడా తమ బూతుమాటల పాటల్తోనే మెప్పించి, వెళ్తారు.

తోటి వారికి సహాయంచేసి, తోడ్పడే వేషం 'తోటివేషం'. వీధుల్లో మనం వేసిన చెత్తా చెదారాన్ని

తోడివారు చీపురుతో త్రోసి, చేటలోనికి వేసికొని, దూరంగా తీసుకెళ్ళి పారేసి, మనల్ని ఆరోగ్యంగా వుండేటుగా చేస్తున్న మహాసేవకుడు 'తోటివాడు'. వాని తోటివాడు మరొకటి లేదు. సహనం, సమాజసేవా దృక్పథం, ద్వంద్వాతీత్వం, తోటివానినుండి మనం గ్రహించాల్సిన గుణాలు. మనకు అసహ్యమైన పదార్థాల్ని - సాటి మానవుడైన తోటివాడు ఏమాత్రం అసహ్యపడక - చీపురుకట్టతో త్రోసి, చేటకెత్తుకొని, పరిసరాన్ని శుభ్రంచేస్తున్న ఇతని సేవ మాధవసేవయే!

మొదటినాటి వేషంలోని వైరాగ్యం, రెండవనాటి ద్వంద్వసహిష్ణుత స్వార్థానికే పరిమితం కాకుండా, అవి సమాజసేవలో అంకితంకావాలి. అపుడే సంపాదించిన - సాధించిన వైరాగ్యాదిసాధనసంపద సార్థక మవుతుంది. 'మానవసేవయే మాధవసేవ' అనే ఉత్తమ ప్రబోధాన్ని ఆచరణద్వారా నిరూపిస్తూంది - తోటి

వేషం! శుభ్రం చేశాక, అందుకు సాధనాలైన చేటా, పొరకా - ఇంకెందుకు? వాటిల్ని గంగమ్మకే సమర్పించి, నీ ఆజ్ఞను నిర్వర్తించినామన్న సంతోషంలో మైమరచిన స్థితిలో ఏవో పాడుకొంటూ వెళ్లడం - ఒక గొప్ప ప్రజ్ఞాస్థితి! మనస్సులో దాగివున్న తుచ్ఛమైన కోరికలన్నీ బూతులరూపంలో వ్యక్తమై - వెళ్లి పోవడంతో - పిదప మనస్సులో అమ్మవారే స్థిరంగా వుంటుంది. తనలో తీరని కామవాంఛలే బూతులుగా వెల్లడి అవుతాయి - అని భావించాలి.

తోటి వారికి సాయపడడమే తోటివేషం నిరూపించే సాటిలేని ధర్మప్రబోధం! అందుకే జగన్మాత మూడవనాడు 'తోటివేషాన్ని' వేసింది.

ఈ మూడు రోజులు వేసే వేషాల్లో పిల్లలు వేసే వేషాలే ఎంతో ప్రాశస్త్యం వహిస్తాయి. వీటిల్ని మ్రొక్కుబడి వున్నా లేకున్నా అందరూ వేస్తారు. బైరాగి,

బండ, తోటివేషాలకు మాత్రమే బూతులు మాట్లాడడం, బూతుపాటలు పాడటం వుంటుంది. తక్కిన వేషాలకు బూతుపాటలు పాడరు. గుడితరపున వేషాలు వేసే కైకల, చాకలి వంటివారు ఏవేషానికైనా బూతుపాటలు పాడరు.

## 4. దొరవేషం :

దీన్ని శనివారం వేస్తారు. ఈ వేషాన్ని కైకాల, చాకలి కులస్థులే ఆనువంశికంగా వేస్తారు. ఇతరు లెవరూ వేయరు. దొరవేషంలో స్త్రీవేషం వుండదు. కైకలకులస్థుడు దొరవేషాన్నీ, చాకలికులస్థుడు మంత్రి వేషాన్నీ వేస్తారు. ప్రక్కనే తోటివాడు పాలెగాని తలను (కొయ్యది) చేత బట్టుకొని వుంటాడు. మునుపు దొరవేషగాళ్లు గుర్రాలపై వూరేగేవారు. ఇపుడు నడిచి వెళ్తారు. భటులవేషంవారు రాజ చిహ్నాలున్న సురటీలను (గుండ్రని విసనకర్రలను) పట్టుకొని

వుంటారు. డప్పుల వాద్యాలతో చూడముచ్చటగా కళాత్మకంగా వుంటుంది – దొరవేషం. ఈ వేషధారులు వూరంతా తిరిగి పూజ లందుకుంటారు. తిరుపతిలోని వారేగాక, సుదూరప్రాంతాల నుంచీకూడ ఈ వేషాలు వేసుకొని, తిరుపతికి వచ్చి, పురవీథుల్లో వూరేగి, గంగమ్మను పూజించి వెళ్తారు.

ఇంతేకాకుండా గంగమ్మ భక్తులు పౌరాణిక, జానపద, సాంఘిక వేషాలు ఎన్నో వేస్తారు. ఈ వేషాలు చూపరులకు ఎంతో ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ, వినోదాన్నీ కల్గిస్తాయి. ఉదయంనుంచి, రాత్రి పది గంటలవరకూ ఈ వేషాల సందడి వుంటుంది. శివుడు, రాముడు, కృష్ణుడు, హనుమంతుడు, దుర్యోధనుడువంటి పౌరాణిక వేషాలూ, రాజు, మంత్రి, భటుడు, జ్యోతిష్కుడు, మాంత్రికుడు, పూజారి, డాక్టరు, రోగి, రౌడీ, త్రాగుబోతు, దొంగ, స్త్రీ వంటి

సాంఘిక వేషాలూ, చాకలి, కుమ్మరి, యానాది, లంబాడీ, నక్కల, సోదివంటి జానపదవేషాలూ ఈ ప్రదర్శనల్లో వుంటాయి. ఊరక వేషమేకాక, దానికి తగిన పాటలూ పాడ్తారు.

ఈ వేషాలు కొందరు వుత్సాహంతో, కొందరు మ్రొక్కుబడి చెల్లించేందుకూ వేస్తారు. అందరూ చివరకు గంగమ్మను దర్శించి, పూజిస్తారు. నిజమేకదా! సర్వకర్మలూ జ్ఞానంలో పరిసమాప్తం అవుతా యని గీత చెప్పింది – ప్రత్యక్షరసత్యం!

ఏ కార్యం సాధించాలన్నా కేవలం ఉత్సాహశక్తి వొక్కటే చాలదు. ఉరకలేసే వుత్సాహాన్ని నియమంతో నడిపించి, కార్యం సత్ఫలవంతం, ఆదర్శవంతం కావడానికి ప్రభుశక్తికూడా కావాలి. అప్పుడే జీవితం నియమపూర్వకంగా ఒడుదుడుకులు లేకుండా కొనసాగుతుంది.

దొర=రాజు. ప్రజల్ని రంజింపజేస్తూ ధర్మబద్ధంగా పాలించడం రాజధర్మం! ఇందులో దుష్టశిక్షణ, శిష్టరక్షణ వుంటాయి.

గంగమ్మ దొరవేషంలో సంచరించి, కామాంధుడైన పాలెగాణ్ణి హతమార్చడంలో దుష్ట శిక్షణ, యువతీజనాన్ని కాపాడటంలో శిష్టరక్షణ జరిగింది. అంతరంగశత్రువులైన ఆరింటిలో మొదటిదైన కామమే బలమైన శత్రువు. తక్కిన క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు కామాన్ని అనుసరించే వుంటాయి. కామరూప శత్రువును తప్పక జయించమనింది – భగవద్గీత. కామాంధుల్ని శాసించే శక్తియే దొర. కనుక ఇటు ప్రభురూపంలో పరాశక్తి కామరూపుడైన పాలెగాణ్ణి తలనరికి, చంపింది. అంటే కామాన్ని సంహరించింది.

కల్గిన వైరాగ్యభావన స్థిరపడాలంటే కామాన్ని

జయించడం చాలా అవసరం! "కామదాసుడైనవాడు రామదాసుడు కాలే"దని పెద్ద లంటారు. అమ్మవారు 'మహారాణి'. పరమేశ్వరుడు సర్వేశ్వరుడు - కనుక అభేదస్థితిగల ఈ దంపతులు (ఈశ్వరీ ఈశ్వరులు) కామాన్ని హతమార్చడంలో సిద్ధహస్తులు! కోరికలను జయించినవారు విశ్వాన్నే జయించినవారు కాగలరు. కామజయం మోక్షానికి చివరిసోపానం. తలనరకడం - కోరికలను సమూలంగా నరకడమే!

విశ్వమే తానైన విశ్వేశ్వరి ఏ వేషం ధరించినా అది లోకకల్యాణం కోసమేతప్ప - అందులో స్వార్థానికి తా వుండదు. దొర వేషంలో పాలెగాని తలనరకడం కామంతో కన్నుమిన్నుకానక ప్రవర్తించే వారికి ఇదే గతి పట్టుం దని లోకానికి చాటి చెప్పడం ఇందలి ఆంతర్యం!

## అమ్మవారికి శ్రీవారి శేషవస్త్రాలు

శ్రీవారిశేషవస్త్రబహూకృతి(సారె) శనివారం జరుగుతుంది. కలియుగప్రత్యక్షదైవమైన శ్రీవేంకటేశ్వరునికి గంగమ్మ చెల్లెలుకదా! కనుక గంగ జాతరసందర్భంగా సారెగా శేషవస్త్రాలూ, పసుపు, కుంకుమ, గంప, చేట మున్నగు మంగళ ద్రవ్యాలు, శ్రీవారి తరపున తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రతిసంవత్సరం అందజేస్తారు. ఈ కార్యక్రమాన్ని శనివారం సాయంకాలం శ్రీగోవిందరాజస్వామివారి ఆలయంలో-తిరుమల-తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారిగారినుండి, శ్రీ తాతయ్యగుంట గంగమ్మఆలయం అధ్యక్షులు స్వీకరిస్తారు. పిదప తిరుపతి శాసనసభ్యులవారి ఆధ్వర్యంలో పట్టణంలో ఊరేగింపుగా సారెను తీసుకెళ్ళి, అమ్మవారికి సమర్పిస్తారు. ఈ 'మంగళసారె' వూరేగింపు

శ్రీగోవిందరాజస్వామి వారి ఆలయంనుండి కర్ణాలవీథి, బేరివీథి, గాంధీరోడ్డు, బండ్లవీథి, పెద్దకాపువీథి గుండా శ్రీతాతయ్యగుంట గంగమ్మ ఆలయానికి చేర్తుంది. (గంగమ్మ శ్రీవారికి చెల్లెలు ఎలా అవుతుందో ఇంతకుముందే విన్నవింపబడింది). భర్త ఎన్ని యిచ్చినా - పుట్టినింటివా రిచ్చినవాటిపైననే సామాన్యంగా స్త్రీలకు మమకారం, అభిమానం ఎక్కువకదా!

## 5. మాతంగివేషం :

ఆదివారం ఈ వేషం వేస్తారు. ఇది ఆరవనాటిది. మాతంగి వేషాన్ని ముఖ్యంగా మ్రొక్కుబడివున్నవాళ్లే వేస్తారు. ఉదయం స్నానాంతరం తలకు పసుపుగుడ్డను జడలాగా కట్టి, కొప్పుముడివేసి, మల్లెపూలు చుట్టుకొంటారు. శరీరమంతా గంధం పూసుకొని, తెల్లగళ్ల చీర లేదా పసుపుచీర కట్టుకొని, రవిక

తొడుగుతారు. మెడలో పూలహారం ధరిస్తారు. ఒడిబాలు (ఒడిబియ్యం) కట్టుకొని అందులో అక్షతలూ, దువ్వెన, భరణి, రవికగుడ్డ, పసుపు, కుంకుమ ఉంచుతారు. 'మాతంగి' వెయ్యికళ్లదేవత అని తలంచి, ముఖానికీ, ఒళ్లంతా నల్లని ఎర్రని బొట్లుపెట్టు కొంటారు. పలకలు వాయిస్తూ, కొమ్ములు వూదుతూ వుంటే మాతంగివేషం వేసినవాళ్లు లయబద్ధంగా చిందులు వేస్తూ వచ్చి, అమ్మవారిని దర్శించి, మొక్కుబళ్లు సమర్పిస్తారు. ఈ వేషాన్ని గుడి తరపున మిరాశిదార్లూ, మొక్కుబడివున్న స్థానికులూ వేస్తారు. మిరాశిదార్లు వేసే మాతంగి వేషంలో కైకల కులస్థుడొక్కడే పాల్గొంటాడు. చాకలికులస్థులు పాల్గొనరు. మాతంగి వేషాన్ని గంగమ్మవిశ్వరూపంగా భావిస్తారు. మాతంగివేషధారి తన ఒడిబాలులోనున్న అక్షతలనూ, వేపాకునూ అందరికీ పంచిపెట్టూ, పట్టణంలోని అందరియిండ్లకూ వెళ్లి, పూజలు

అందుకొంటాడు. ఈ వేషం వేసినవారివెంట అతని బంధుమిత్రులు కూడా వుంటారు.

మాతంగి=మతంగమహాముని పుత్రిక. ఈమె సాక్షాత్తూ పరాశక్తి. ఒకమహావిద్యకూడా! 'మహారాణి'గా పుట్టినింటి సారెగైకొన్న అమ్మవారు ఆనందాతిశయంతో తన విశ్వరూపాన్ని ప్రదర్శించింది. ఒక అవతారంలో మంతంగమహాముని పుత్రికగా రూపొందింది - అమ్మవారు. సహస్రాక్షిగా మాతంగి వుంటుం దని భావించడం పరాశక్తి యొక్క అనంతనేత్రాలతో కూడిన విశ్వాక్షిత్వానికి సంకేతం. తెల్లచీర సత్త్వగుణానికీ, పసుపు చీర మంగళత్వానికీ, మల్లెపూలు సద్భావాలకూ, అక్షతలు అక్షయత్వానికీ, మంగళద్రవ్యాలు సౌభాగ్యత్వానికీ సంకేతాలు. సకల సౌభాగ్యాలూ, సకలశుభాలూ అందరికీ నావల్లనే సిద్ధిస్తున్నా యనడానికే - అందరికీ ఆ వస్తువులను

పంచిపెట్టడం! ఇచ్చట ఆత్మయొక్క సాకారరూపమే మాతంగి అని భావించాలి. జగత్తు సర్వమూ శక్తిమయం కదా! ఆ శక్తియే గంగమ్మ. విష్ణుసోదరి. తన్ను తాను గుర్తించడమే కదా నిజమైన జ్ఞానఫలం! అదే మాతంగీరూపధారణం! మాతంగీరూప దర్శనం.

**6. సున్నం కుండలు:**

ఈ వేషాన్ని సోమవారం ఇద్దరు కైకాల కులస్థులు వేస్తారు. ఈ యిద్దరూ పెద్దగంగమ్మ, చిన్నగంగమ్మలకు ప్రతీకాలు. రెండుకొత్తకుండలకు సున్నం పూసి, కుంకుమబొట్లు పెట్తారు. కుండక్రింది భాగం మధ్యలో చిన్నరంధ్రం ఏర్పస్తారు. కుండల అంచులవద్ద మూరెడు పొడవుండే నాల్గు వెదురుపుల్లల్ని కట్టి, వాటికి ఆధారంగా అడ్డు పుల్లల్ని చుట్టూకట్తారు. ఈ సున్నం కుండల్ని వేషధారుల తలపై కిరీటంగా అమర్చుతారు. వెదురుదబ్బలకు మల్లెపూలు చుట్తారు.

ఈ వేషం ధరించిన వారు పసుపు చీర కట్టుకొని, రవిక దాల్చి, సొమ్ములు, పెద్దకమ్మలూ, ధరిస్తారు. ఒడిబాలులో మంగళద్రవ్యాలు ఉంచుకొంటారు. చుట్టూ పంబల వాళ్లు పంబలు వాయిస్తూ, పాటలు పాడుతూ వెంట వస్తుండగా ఇంటింటికీ వెళ్లి, పూజలందుకొంటారు.

సున్నంకుండలువేషంలో ఎంతో ఆధ్యాత్మికస్ఫూర్తి వుంది. కుండ శరీరానికి సంకేతం. దానికి సున్నం పూయడం - దాన్ని (శరీరాన్ని) శుద్ధసత్త్వమయం చేయడం. కుంకుమబొట్లు పెట్టడం దానికి మంగళత్వం కల్గించడం. కుండ క్రింది చిన్నరంధ్రం - కుండలినీశక్తి స్థానసంకేతం. మూతి అంచువద్ద కట్టే నాల్గు వెదురు పుల్లలూ ధర్మార్థకామ మోక్షాలకూ, అడ్డంగా చుట్టే పుల్లలు అంతఃకరణ చతుష్టయానికీ (మనోబుద్ధి చిత్తాహంకారాలకు) సంకేతాలు.

మల్లెపూలు సద్భావాలకు చిహ్నాలు. పసుపు చీర - కల్యాణప్రదత్వానికి గుర్తు. వాద్యాలు మంగళవాక్కులకు సంకేతాలు. ఇలా సున్నపు కుండల వేషాలు రెండే వుండటం ఇద్దరు గంగమ్మలకే కాక జీవాత్మ పరమాత్మలకుకూడా వర్తిస్తాయి. కుండలలోని శూన్యం భావరాహిత్యానికి - అంటే నిర్వికార చిత్తతకు దృష్టాంతం. ఆ కుండలవంటి స్థితిలో నిర్మలాంతః కరణులైనవారు శుద్ధసత్త్వగుణంతో ప్రకాశించి, అమ్మవారిదయకు పాత్రులై జన్మరాహిత్యాన్ని, శాశ్వతానందాన్నీ పొందుతారు. అమ్మవారు ఆనందరూపిణి, ఆనందదాయినికదా! వీరు జ్ఞానమూర్తులనే భావంతో భక్తులు వీరిని కుర్చీలలలో కూర్చోబెట్టి, కాళ్లుకడిగి, పాదపూజలు గావించి, నమస్కరిస్తారు. స్థానికులు అనేకవేషాలతో వచ్చి, అమ్మవారిని దర్శిస్తారు.

ఈ సోమవారం రాత్రి 12-15 ని॥లకు అమ్మవారికి ప్రత్యేకంగా అభిషేకం జరుగుతుంది.

అమ్మవారి జాతరలో "చాటు" రోజు మొదలు - మాతంగివేషంరోజువరకూ భిన్నభిన్నరీతుల్లో చిత్రవిచిత్రవేషధారణల్తో, అలసిన అమ్మవారిని, శాంతింపజేసేందుకై సోమవారం రాత్రి క్షీరాభిషేకం, పంచామృతాభిషేకం, నారికేళజలాభిషేకం, పసుపు నీళ్లతో అభిషేకం, ఇంకా అనేక మంగళద్రవ్యాలు కలిపిన నీటితో అభిషేకం జరుపుతారు - అర్చకులు. పిదప విశేష పుష్పాలంకారం జరిపి, భక్తుల్ని అమ్మ దర్శనపాత్రుల్ని చేస్తారు.

పంచామృతద్రవ్యములతో, సుగంధ మంగళ ద్రవ్యాలు కలిపిన జలంతో విగ్రహానికి అభిషేకం చేయించడంవల్ల విగ్రహంలో సాత్త్వికత, నిర్మల

తేజస్సు, శాంతగుణం, కృపాగుణం వృద్ధి అవుతుంది. మూర్తి సౌమ్యంగా, సుందరంగా గోచరిస్తుంది.

దుష్టశిక్షణలో గ్రైకొన్న రాజసతామసగుణ ప్రభావం - ఈ క్షీరాభిషేకాదులవల్ల తగ్గిపోయి, విగ్రహంలో సత్త్వగుణం, శాంతస్వభావం నెలకొంటాయి. శిష్టరక్షణకు కావలసిన సౌమ్యరూపం ఏర్పడుతుంది. కృపారసప్రపూర్ణహృదయయైన గంగమ్మ - అమృతాభిషేకంతో కృపామృతమూర్తియై శోభించి, భక్తుల్ని చల్లగా కాపాడుతుంది.

**7. సప్పరాలు :**

ఈ ప్రదర్శన మంగళవారం జరుగుతుంది. తెలుగులో 'చప్పరం' అనే పదమే జనవ్యవహారంలో 'సప్పరం' అయింది. చప్పరమంటే గుడారం. పందిరి. జాతరలో చివరిరోజు చప్పరాల మ్రొక్కుబళ్లు చెల్లిస్తారు.

గోపురాన్ని పోలిన సప్పరాలను వెదురుదబ్బలతో తయారుచేసి, వాటిని శరీరంపై నిలబెట్టుకోవడానికై బాధను భరించి, నడుంకు గ్రుచ్చుకోవడం ఈ జాతరలో ఒక ప్రత్యేకత. కోరికలు ఫలిస్తాయన్న నమ్మకంతో శరీరాకృతికి అనుగుణంగా సప్పరాలను ఏర్పాటుచేసుకొంటారు. సోమవారం రాత్రినుండి ఈ వేషధారులు శరీరమంతా గంధం పూసుకొని, మెరిసే దుస్తుల్ని నడుంకు ధరిస్తారు. మల్లెపూలు తలపాగావలె చుట్టుకొంటారు. వెదురుపుల్లలు తెచ్చి, నట్టింట బెట్టి, కుంభం వేసి, హారతులు ఇస్తారు. వెదురుదబ్బల్ని గోపురాకారంగా వంచి, తయారుచేసి, రంగురంగుల కాగితాలను అతికించి, గోపురంలో బొమ్మల్లాగా బెండ్లతో తయారుచేసి అమర్చుతారు. లయబద్ధంగా చిందులువేస్తూ వెళ్ళి, అమ్మవారిని దర్శిస్తారు. ఈ సప్పరాల నిర్మాణం ఎంతో కళాత్మకంగా వుంటుంది.

ఈ గోపురాకారనిర్మాణవిన్యాసప్రదర్శన అద్వైత భావనకు సంకేతం. దేహమే దేవాలయం. జీవుడే దేవుడు. అజ్ఞాన నిర్మాల్యాన్ని త్యజించి; నేనే ఆ పరమాత్మనైయున్నాననే భావనతో పూజించమంటుంది – శాస్త్రం! ఇచ్చట గోపురం = దేవాలయం. ధరించిన వ్యక్తి జీవుడు. అతనిహృదయంలోని గంగమ్మయే ఆత్మ. మ్రొక్కుబళ్లు చెల్లించడం సర్వ సమర్పణం! అపుడు మిగిలేది ఆనంద మొక్కటే! గోపురమంటే పురద్వారం. దేవాలయద్వారం. 'శూరులచే రక్షింప బడునది' అని వ్యుత్పత్తి. కామక్రోధాదులనే శత్రువుల్ని లోనికి రానీకుండా రక్షించేది – ఈ గోపురం. కనుక సప్పరాల సంబరం జ్ఞానానందనిలయం!

**పేరంటాలవేషం :** మంగళవారంనాడే పేరంటాల వేషంకూడా వుంటుంది. ఈ వేషాన్ని కైకాలవాళ్ళే

ధరిస్తారు. ఎర్రగళ్ల చీరగట్టి, ఎర్రనిగుడ్డలో ఒడిబాలు కట్తారు. అందులో అక్షతలు, చవ్వాకు, దువ్వెన, అద్దం, నల్లగాజులు, పసుపు, కుంకుమ ఉంచుతారు. తలకు నల్లని గుడ్డ కట్టి, కొప్పులాగా ముడివేస్తారు. ఆ కొప్పులో పూలు పెట్తారు. తలపై బంగారంలాగా కనిపించే అట్టలతో చేసిన జడ బిళ్లలు, పట్టీలవంటి అభరణాలూ కట్టుకొంటారు. పంబల వాద్యాలతో చాటుమండపంవద్దకు వెళ్లి, పూజలందు కొని, అటునుండి చిన్నగంగమ్మచెంపనరికి, ఆ తరువాత పెద్దగంగమ్మచెంప నకరడంతో జాతర పూర్తి అవుతుంది.

పేరంటాలవేషంలో ఇద్దరు గంగమ్మలూ ఒక్కటవుతా రని భక్తులు భావిస్తారు.

శక్తిదేవతలకూ, గ్రామదేవతలకూ జంతు బలులిచ్చి, తృప్తిపరచడం అనాదిగా వస్తున్న

సంప్రదాయం. ఇది ప్రాణి హింసతో కూడిందే అయినా చాలాచోట్ల జరుగుతున్న విధానమే! ఒక్కొక్క జంతువు ఒక్కొక్క గుణానికి సంకేతం. ఆ జంతువును బలియివ్వడంద్వారా తనలోని ఆగుణాన్ని శక్తి దేవతకు సమర్పించినట్లుగా భావించుకొంటాడు – భక్తుడు. సంతానంకోసం, దుష్టశక్తుల్ని పారద్రోలడం కోసం, నిధినిక్షేపాలు పొందడంకోసం, దిష్టిదోషం పోవడం కోసం, కోరికలు తీరడంకోసం – ఇలా ఎన్నో ఆశలతో జంతుబలు లిస్తున్నారు. తిరుపతిగంగ జాతరలోనూ ఈ పద్ధతి నేటికీ కొనసాగుతూనే వుంది. ఎన్నో శతాబ్దాలుగా వస్తున్న ఆచారాన్ని ఆపడం కష్టం! ఎవరెట్లు పూజిస్తారో వారిని దేవత అట్లే రక్షిస్తుంది.

బూతుమాటలు, పాటలు జాతరలో విశేషంగా వుంటాయి. ఇవి మనిషిహృదయంలో తీరక దాగియున్న కోరికలు వ్యక్తమయ్యేదశలో వచ్చే అప్రయత్నవాగ్రూపచర్యలు! ఇవి అలా మాటలుగా,

పాటలుగా వ్యక్తం కావడంతో - హృదయం నిర్మలమై, నెమ్మదిస్తుంది. ఈ బూతుమాటలు ఎక్కువగా శృంగారానికి చెందినవై వుంటాయి. ఒకనాటి ప్రాచీన మానవుని మనోభావాలకూ, శృంగారప్రవర్తనకూ అద్దంలాంటివి - ఈ బూతులు. వీటినిగూర్చి ఎక్కువగా వివరించుట సముచితం కాదు.

తిరుపతిగంగజాతరలో పొంగళ్లు, నైవేద్యం కూడా వుంటుంది. పైన పేర్కొన్న వేషాలేకాక, వారి వారి అభిరుచులనుబట్టి ఎన్నో వింత వింత వేషాలు వేసుకొని అమ్మవారిని దర్శించి, వస్తుంటారు. మానవునివిశ్వాసం ఇంతటికీ మూలం! దేవత నిమిత్తం మాత్రం. సర్వాన్నీ సమతాదృష్టితో చూచి, రక్షించడం దేవతల కర్తవ్యం!

ఒకే విద్యుత్తుతో అనేకకార్యక్రమాలు నిర్వహిస్తున్నట్లే భక్తికూడా అనేక రూపాల్లో, క్రియల్లో అభివ్యక్తమవుతూంటుంది. భౌతికదృష్టివేరు. ఆధ్యాత్మిక

దృష్టివేరు. ఈ రెండినీ సమన్వయపరచుకొని, మనుగడ సాగించడానికే ఉత్సవాలూ, జాతరలూ ఏర్పడ్డాయి. ఏకార్యమైనా తాత్త్వికదృష్టితో చూస్తే – అంతా భగవన్మయంగానే గోచరిస్తుంది. గంగమ్మజాతరలోని బలులూ, తిట్లూ కూడా విలాసంగా, వినోదంగా, తాత్త్వికంగా భావించి, దర్శిస్తే అంతా పరాశక్తి యొక్క చిద్విలాసమే నని తెలుస్తుంది.

మొత్తంపై తిరుపతి గంగజాతరకు ఎక్కడా లేని ప్రత్యేక విశిష్టత ఏర్పడింది. శ్రీ వేంకటేశ్వరుని చెల్లెలుగా గంగమ్మకు గొప్ప స్థానం ఏర్పడింది. గ్రామ దేవతగా తిరుపతి పట్టణాన్ని నిత్యమూ శోభాయమానంగా అభివృద్ధిపథంలో నడిపిస్తూంది – గంగమ్మ దేవత!

**అన్నాచెల్లెండ్రు తిరుపతిని మహోన్నత**
**పుణ్యక్షేత్రంగా తీర్చిదిద్దుదురుగాక!**
**"నమో గంగాంబికాయై"**

**॥ శుభమస్తు ॥**

(ఈ సంకలనంలో 'పేటశ్రీ' వారి గ్రంథం, పైడాలమౌలానాగారి రచన, గంగమ్మగుడివారు ప్రచురించిన గంగజాతర ఆహ్వాన కార్యక్రమ పత్రిక మున్నగునవి ఎంతో సహకరించాయి. ఆయా రచయితలకు హార్దకృతజ్ఞతలూ, ధన్యవాద నమస్సులు)

ధర్మాన్ని రక్షించండి.

ధర్మమే మిమ్మల్ని రక్షిస్తుంది.

**- ధర్మప్రచార పరిషత్తు**

